బలలవం బుమాపతికిఁ బారణ కాఁనఁ జరించుబోయ భ
క్తులకు వలంతియయ్యెఁ దుదకుం దృఢభక్తికి సాటియున్నదే? ॥ 63

తా॥ సాంబశివునియొక్క దేహమునకు మాటిమాటికిని త్రోవనడిచిన పాదరక్షకినుబోమల నడిమిచోటుగా నాచరింపబడినది త్రిపురాంతకుఁడైన శివుని దేహమునకు పుక్కిటి నీళ్ళభిషేకముగా నాచరింపఁబఁడినవి, ఇంచుక తినగా మిగిలిననంజుడు వేడివేడినైవేద్యముగా నాచరింపఁబఁడినది, అడవినదిరుగుబోయవాఁడు భక్తాగ్రగణ్యుండుగ నాచరింపఁబఁడివాఁడు కాన భక్తియనునది యేమేమిచేయదు ఎల్లపనులనుంజేయనేర్చునని తాత్పర్యము. ఒకానొక పరమభక్తుండిటుచేసి కైవల్యమును బొందెననిపురాణప్రసిద్ధి, ఇట్లుచెప్పుటచేత శివభక్తిగల పురుషునిపరమశివుఁడు పెక్కువిధములచే పరిశోధించి కైవల్యమిచ్చుచున్నాఁడని ముఖ్యతాత్పర్యము.

శ్లో॥ వక్షస్తాడనమంతకస్యకఠినా పస్మారసంమర్దనం
భూభృత్పర్యటనం నమత్సురశిరఃకోటీరసంఘర్షణం।

కర్ణేదం మృదుళస్య తావకపదద్వంద్వస్య గౌరీపతే।
మచ్చేతోమణి పాదుకావిహరణం శంభో సదాంగీకురు॥ 64

టీ॥ అంతకస్య = యమ ధర్మరాజుయొక్క, వక్షస్తాడనం-వక్షః = రొమ్మునందు, తాడనం = తన్నుటయు, కఠినాపస్మారసమ్మర్దనం-కఠిన = కఠినమయినట్టి, అపస్మార = అజ్ఞానముయొక్క, సమ్మర్దనం = నిగ్రహించుటయు, భూభృత్పర్యటనం-భూభృత్ = కైలాసపర్వతమందు, పర్యటనం = సంచరించుటయు, నమత్సురశిరఃకోటీరసంఘర్షణం-నమత్ = నమస్కారములు చేయుచున్న, సుర = దేవతలయొక్క, శిరః = శిరస్సులయందలి, కోటీర = కిరీటములయందు, సంఘర్షణం = ఒరయుటయు, హేగౌరీపతే = ఓయి పార్వతీమనోహరుఁడవయిన ఈశ్వరుఁడా, హేశంభో = ఓయి సుఖకరుఁడవయిన మహాదేవుఁడా, మృదుళస్య = మార్దవయుక్తమయినట్టి, తావకపదద్వంద్వస్య = నీసంబంధమైన పాదయుగళముయొక్క, కర్మ = వ్యాపారము, మచ్చేతోమణిపాదుకావిహరణం-మత్ = నాయొక్క,

చేతః = మనస్సనియెడి, మణిపాదుకావిహరణం = మణిమయపాదుకలయందు విహరిం
చుటను, సదా = ఎల్లప్పుడు, అంగీకురు = అంగీకరించుమా.

ఉ॥ ఘోరతమంబడంపఁ గలుషుంగిరికోనఁ జరింప, దుంతబా
భారవ్రతుఁ డిటుం బ్రులెదపైఁ బడదన్న, నమత్సుపర్వకో
టీరపురాయుడిఁ నలిగెడిఁ గద నీమృదుపాదముల్ జగ
ద్భార మదీయచిత్తమణి పాదుకలందుఁ జరింపరాదొకో॥ 64

పాఠాంతరము.

మ॥ కలుషుం గొంచుఁ జరింప, దండధరునత్యుఃపీఠిఁ దాడింప ని
ష్ఠుర[illegible]క్రమతమంబడంపఁగ, నమస్సుర్వాణగీర్వాణ శే
[illegible] కోటీ[illegible], వేదచిక్కులపల్ నొప్పుచే పాదముల్
[illegible]యింపఁగవె మన్మనోమణిమయా చరత్పాదుకాపాళిపై।

తా॥ అనగా సుఖకరుఁడవును పార్వతీభర్తవునైన యీశ్వరుఁడా యమధర్మ రాజుయొక్క రొమ్ము తన్నుటయు, అజ్ఞానముయొక్క నిగ్రహించుటయు, కైలాస పర్వతమందు సంచరించుటయు, నమస్కరించుచుండెడు దేవతలయొక్క శిరస్సులయం దలి కిరీటములయందు ఒరయుటయుఁగల అతిమృదువయిన నీపాదద్వంద్వముయొక్క కర్మ నామనస్సనెడి మణిమయపాదుకలయందు విహరించుటగా అంగీకరించుమూయని తాత్పర్యము.

శ్లో॥ వక్షస్తాడనశంకయావిచలితోవైవస్వతోనిర్జరాః
కోటీరోజ్జ్వలరత్నదీపకలికానీరాజనంకుర్వతే।
దృష్ట్వాముక్తివధూస్తనోతినిభృతాంశ్లేషంభవానీపతే।
యచ్చేతస్తవపాదపద్మభజనంతస్యేహాకిందుర్లభం॥ 65

టీ॥ హేభవానీపతె = ఓయిపార్వతీ మనోహరుఁడవయిన ఈశ్వరుఁడా, య చ్చేతః-యత్ = ఏపురుషునియొక్క, చేతః = చిత్తము, తవ = నీయొక్క, పాదపద్మ భజనం-పాదపద్మ = పద్మములవంటి పాదములయొక్క, భజనం = సేవచేయునది,

భవతి=అవుచున్నదో, తం=వానినిచూచి, వైవస్వతః=యమధర్మరాజు, వక్షస్తాడన శంకయా-వక్షః=రొమ్మురొక్క, తాడన=తన్నుటరొక్క, శంకయా-శంకచేతను, విచలితః = పలాయమానుఁడగుచున్నాఁడు,నిర్జరాః=దేవతలు,కోటీరోజ్జ్వలరత్న దీపక లికానీరాజనం-కోటీర=కిరీటములయందు,ఉజ్జ్వల=ప్రకాశించుచున్నట్టి, రత్న దీప=దీపములవంటిరత్నములరొక్క, కళికా=అంకురములచేతను, నీరాజనం=నివాళిని, కుర్వతే చేయుచున్నారు, ముక్తివధూః=ముక్తికాంత, నిభృతాశ్లేషం = గాఢాలింగనమును, తనోతి = చేయుచున్న,తస్య = ఆభక్తునికి,ఇహ = ఈలోకమందు, దుర్లభం = పొంద నశక్యమయినవస్తువు, కిం = ఏమియున్నది.

చ॥ ఎదపయిఁ దన్నునంచు యముఁడింతట నంతట బాఱు, వేలుపుల్
గదిసి కిరీటరత్నకలితాతతి నారతులెత్తుచుండ్రు, తా
నెదురయి ముక్తికాంత దనియించును గాటపుఁగౌఁగిలింతలన్
మది భవదీయపాదములనాఁటినవానికి కేటిలోటిలన్॥ 65

తా॥ అనగా ఓయిపార్వతీమనోహరుఁడవయిన ఈశ్వరుఁడా! ఎవనియొక్క చిత్తము నీపాదపద్మసేవయందు ఆసక్తమగుచున్నదో వానినిచూచి యముఁడుముందునీవు రోమ్మన తన్నుటనుతలంచి భయపడి దూరముగా పరుగెత్తిపోవుచున్నాఁడు. దేవతలు తమకిరీటములయందు దీపములవలెనుండు రత్నములయొక్క అంకురములచేత నారతులిచ్చుచున్నారు. ముక్తికాంత గాఢాలింగనము చేసికొనుచున్నది. గనుక ఆభక్తునికి ఈలోకమందు పొందనశక్యమైన వస్తువేదియులేదు. సర్వమును స్వాధీనమయి యుండునని తాత్పర్యము.

శ్లో॥ క్రీడార్థం సృజసి ప్రపంచమఖిలం క్రీడామృగాస్తే జనాః
యత్కర్మాచరితం మయాచ భవతః ప్రీత్యైభవత్యేవతత్
శంభో! స్వస్యకుతూహలస్య కరణం మచ్చేష్టితం నిశ్చితం
తస్మాన్మామకరక్షణం పశుపతే! కర్తవ్యమేవత్వయా॥ 66

టీ॥ హేశంభో = ఓయిసుఖకరుఁడవయిన ఈశ్వరుఁడా, అఖిలం = సమస్తమయి

న, ప్రపంచం = లోకమును, క్రీడార్థం = విలాసమే ప్రయోజనముగాగలు గునట్లుగాను, సృజసి = సృజించుచున్నావు, తే = నీకు, జనాః = జనులు, క్రీడామృగాః = ఆటలాడుకొనుమృగములగుచున్నారు, మయా = నాచేత, యత్కర్మాచరితం = ఏఏకర్మమాచరింపబడుచున్నదో-తత్ = ఆకర్మ, భవతః = నీయొక్క, ప్రైత్యై = ప్రేమకొరకు, భవత్యేవ = అవుచున్నది, మచ్చేష్టితం-మత్ = నాయొక్క, చేష్టితం = వ్యాపారము, స్వస్య = నీయొక్క, కుతూహలస్య = సంతోషమునకు, కరణం = కారణము, భవతి = అవుచున్నది, తస్మాత్ = అందువల్ల, పశుపతే = ఓయి సకలభూతములకున్ను అధిపతివైనవాఁడా, మామకరక్షణం = నాసంరక్షణము, త్వయా = నీచేత, కర్తవ్యమేవ = చేయతగ్గదే అగుచున్నది.

శా॥ నీయాడించుమృగంబు లీజనులు తండ్రీ! లోకముం జేత క్రీ
డాయత్నంబిఁక మాకృతంబులగు చేష్టల్ కర్మముల్గాని బా
గోయోగో యవి నీముదంబున కెగాదో యింక మాదో సమే
దో యేలామముఁ బ్రోవకుండెదవు శంభూ! లోకరక్షాగురూ॥ 66

**తా॥** ఓయిఈశ్వరుఁడా! సమస్తప్రపంచమును విలాసమే ప్రయోజనముగా సృజించుచున్నావు, నీను నీజనులందఱు విలాసముకొఱకు నిర్మింపబడ్డ మృగములవుచున్నారు నాచేతయేయేకర్మ ఆచరింపబడుచున్నదో ఆకర్మ నీప్రీతికొఱకు అవుచున్నది. నాయొక్క చేష్ట నీసంబంధమయిన సంతోషమునకు కారణమవుచున్నది కాన సకల భూతములకును అధిపతివైన నీవే నన్ను సంరక్షింపవలసినవాఁడవు.

శ్లో॥ బహువిధ పరితోష బాష్పపూరస్ఫుటపులకాంకిత
చారుభోగభూమిం। చిరపదఫలకాంక్షి సేవ్యమానాం
పరమసదాశివభావనాం ప్రపద్యే॥

**టీ॥** బహువిధపరితోషబాష్పపూరస్ఫుటపులకాంకితచారుభోగభూమిం-బహువిధ=అనేకవిధములైనట్టి, పరితోషబాష్ప=ఆనందాశ్రువులయొక్క, పూర=ప్రవాహసంబంధమైన, స్ఫుట =వ్యక్తమయినటువంటి, పులకాంకిత=గగుర్పాటురూపమయిన, భక్తి=భక్తియొక్క, అంకిత=చిహ్నముగాచేయబడిన, చారు=మనోహర

మైన, భోగభూమిం =భోగస్థానమైనట్టి, చిరపదఫలకాంక్షి సేవ్యమానాం-చిరపద=శాశ్వతకైలాసస్థానము నెడి, ఫల=ఫలములను, కాంక్షి=కోరుచుండెడివారలచేతను, సేవ్యమానాం=సేవింపబడుచున్నట్టి, పరమసదాశివభావనాం-పరమ=శ్రేష్ఠుండయినట్టి సదాశివ=సాంబునియొక్క, భావనాం =ధ్యానమును, ప్రపద్యే=శరణుపొందుచున్నాను.

మ॥ అమితానందసుధాశ్రుపూరపులకాంకారూఢభోగాది వి
శ్రమమై, శాశ్వతభాగధేయఫలకాంక్షాబద్ధదీక్షామన
స్కమునీట్సంతతసేవ్యమానమయి హింసారూపసంసార వి
భ్రమముం బాపెడు పార్వతీశ్వరపదాబ్జధ్యాన మాశించెదన్॥ 67

తా॥ అనగా అనేకవిధములైనట్టి ఆనందాశ్రుప్రవాహసంబంధమయినట్టిన్ని, వ్యక్తమైనగగుర్పాటురూపమైన భక్తిచిహ్నకుమనోహరమైనభోగభూమియైనట్టిన్ని, శాశ్వతకైలాసస్థానమును కోరెడివారలచేత సేవింపబడుచున్నట్టి శ్రేష్ఠుండయిన సదాశివునియొక్క ధ్యానమునుశరణుపొందుచున్నాను అనగా నన్నురక్షించెడికొరకు ధ్యానము చేయుచున్నానని తాత్పర్యము.

శ్లో॥ అమితముదమృతం ముహుర్దుహంతీంవిమలభవత్పద
గోష్ఠమావసంతీం।సదయ! పశుపతే! సుపుణ్యపాకాంమమపరి
పాలయ భక్తిధేనుమేకాం॥

టీ॥ హేసదయ=ఓయిదయతోఁగూడుకొన్నవాఁడా,పశుపతే=పశుపాలకుఁడా, అమితముదమృతం-అమిత= అపరిచ్ఛిన్నమైనట్టి, ముదమృతం= సంతోషమనుపాలును, ముహుః= మాటిమాటికిని, దుహంతీం= పిండుచుండునదియు, విమలభవత్పదగోష్ఠం-విమల=నిర్మలమయినట్టి, భవత్పద= నీయొక్కపాదములను, గోష్ఠం=దొడ్డిపట్టునుగూర్చి, అవసంతీ= నివాసముగానుండునదియు, సుపుణ్యపాకాం= విమలపుణ్యఫలభూతమయినదియునగు, మమ=నాయొక్క, భక్తిధేనుం-భక్తి= భక్తియనియెడు, ధేనుం= గోవును, ఏకాం= ఒక్కటిని, బరిపాలయ=రక్షించుమూ.

కం॥ వితత ముదమృదముఁబితుకు, సు
కృతఫలమున సంవసించు, నీశ! త్వదీయాం

చితపాదగోష్ఠమున, బశు
పతి! మద్భక్తియనుగోవుఁ బాలింపు దయన్॥ 68

తా॥ అనగా దయతోఁ గూడుకొన్న పశుపతివైన ఈశ్వరుఁడా! అపరిమితమైన సంతోషమనుపాలును మాటిమాటికి నిచ్చునదియు, నిర్మలమయిననీపాదములను దొడ్డియందుండునదియు పుణ్యఫలభూతమయినట్టి నాయొక్క భక్తియను ధేనువును ఒక్కఁడా నీనిరక్షించుమా అనగాలోకములోనొకఁడు పాలిచ్చునావును తాను కాపాడచాలక కాపాడతగినపురుషుని స్వాధీనమెట్లుచేయునో అట్టువలెనని తాత్పర్యము.

శ్లో॥ జడతా పశుతా కళంకితా కుటిలచరత్వంచ నాస్తిమయి దేవ అస్తియది రాజమౌళేభవదాభరణస్యనాస్తికింపాత్రం॥ 69

టీ॥ జడతా=మూఢత్వమున్ను, జలాత్మత్వమున్ను, పశుతా=పశుత్వమున్ను కళంకితా=కళంకత్వమున్ను, కుటిలచరత్వంచ=కుటిలభావమునసంచరించుట యును, చం

ద్రునియందున్నవి, మయి=నాయందు, నాస్తి=లేవు, హేదేవా=ఓయిమహాదేవ్రుడా, హేరాజమౌళే=ఓయిచంద్రుని శిరస్సునందు భూషణముగాధరియించియుండెడువాఁడా, అస్తియది=నాయందున్నట్టులయిన, భవదాభరణస్య-భవత్=నీయొక్క, ఆభరణస్య=ఆభరణమునకు, పాత్రం=పాత్రమయినవాఁడను, నాస్తికిం=కానివాఁడనగుచున్నానాయేమి?

కం॥ లేదుజడత్వము, కుటిలత
లేదు కళంకితయు లేదు, లేదు పశుతయుఁ
నాఁడెసఁ గాదన నీభూ
షాదులకుఁ రాజమౌళి! యర్హుఁడఁగానే॥ 69

తా॥ జడత్వమున్న పశుత్వమున్న కళంకిత్వమున్న కుటిలత్వమున్న యివి చంద్రునియందున్నవి. అట్టి చంద్రుని భూషణముగా శిరస్సునధరించియున్నావు. నాయందు ఈస్వభావము లేమియు లేవు. ఒకవేళనున్నట్టులయిన ఓయిమహా

దేవుఁడా చంద్రుని శిరస్సునందుధరించియుండెడువాఁడా నీకు భూషణముపుటకు పా త్రుఁడనుకానాయేమి అని తాత్పర్యము.

శ్లో॥ అరహసి రహసిస్వతంత్రబుధ్యాపరివసితుంసులభఃప్రస
న్నమూర్తిః। అగణితఫలదాయకః ప్రభు ర్మేజగదధికో
హృదిరాజశేఖరోఽస్తి॥ 70

టీ॥ ప్రసన్నమూర్తిః = ప్రసాదోన్ముఖమయినస్వరూపముకలిగినట్టిన్ని, అగణిత ఫలదాయకః- అగణిత = అసంఖ్యాతమయినట్టి,ఫల = మనోవాంఛాఫలమునకు, దాయ కః = ప్రదాతఅయినట్టిన్ని, ప్రభుః = సృష్టికర్తఅయినటువంటిన్ని, జగదధికః = జగ త్తులకధికుఁడయినటువంటిన్ని, రాజశేఖరః=చంద్రునిశిరస్సునందు ధరించియున్నట్టి ఈశ్వరుఁడు,(రాజశేఖరః = సార్వభౌముఁడనియు సర్థమౌచున్నది),మమ=నాయొక్క, హృది=మనస్సునందు, అస్తి=కలఁడు,అరహసి = బహిఃప్రదేశమందున్న, రహసి = అం తఃకరణమందున్న,స్వతంత్రబుధ్యా = స్వాయత్తమయినబుద్ధిచేతను, పరివసితుం = పరిచ ర్య చేయుటకై, సులభః = సులభుఁడయినవాఁడు, భవతి = అవుచున్నాఁడు.

మ॥ బహిరంతఃకరణస్వతంత్రమతి, సంభావించి కొల్వన్ సు
ర్మ్యహురానంద రసప్రసన్నకరుణాస్ఫూర్తి స్ఫురన్మూర్తియై
మహనీయుండగు రాజమౌళి, త్రిజగన్మాన్యుం డగణ్యప్రియా
వహుండై నామది ప్రత్యహం బునికిసల్పన్ జింతనాకేమిఁకన్॥ 70

తా॥ ప్రసాదోన్ముఖమయిన స్వరూపము కలిగినట్టిన్ని, అసంఖ్యాతములయిన మనోవాంఛాఫలదాయకుఁడయినట్టిన్ని, సృష్టికర్త అయినట్టిన్ని, జగత్తులకధిపుఁడు అయినట్టిన్ని, చంద్రుని శిరస్సునందుధరించియున్నట్టి ఈశ్వరుఁడు, నాయొక్క మనస్సునందు కలఁడు, బహిఃప్రదేశమందున్ను అంతఃకరణమందున్ను స్వాయత్తమైన బుద్ధి చేతను పరిచర్యచేయుటకు సులభుఁడైనవాఁడు అగుచున్నాఁడు అని తాత్పర్యము.

ఈశ్లోక మొక రాజపర్యాయముగాగూడ నర్థమవుచున్నది.

శ్లో॥ ఆరూఢభక్తిగుణకుంచితభావచాపయుక్తైశ్శివస్మ
రణబాణగణైరమోఘైః। నిర్జిత్య కిల్బిషరిపూన్ విజయీ సు
ధీంద్రస్సానంద మావహతి సుస్థిరరాజలక్ష్మీమ్॥ 71

టీక॥ సుధీంద్రః=బుద్ధిమంతుఁడు, ఆరూఢభక్తిగుణసంచితభావచాపయుక్తైః-ఆరూఢ=దిట్టముగ వ్యాపించినట్టి, భక్తి=భక్తిఅనెడు, గుణ=అల్లెత్రాటిచేత, సంచిత=సంచబడ్డట్టి, భావ=భావమనెడు, చాప=ధనస్సునందు, యుక్తైః = కూర్చఁబడ్డట్టిన్ని, అమోఘైః=విఫలములుకానట్టి, శివస్మరణబాణగణైః-శివ=ఈశ్వరునియొక్క, స్మరణ=స్మరణములనెడు, బాణగణైః=బాణసమూహములచేతను, కిల్బిషరిపూన్-కిల్బిష=పాపములనెడు రిపూన్=శత్రువులను, నిజిత్య=నిశ్శేషముగాజయించి, విజయీ = జయముకలవాఁడగుచు, నందం=ఆనందముతో కూడుకొన్నట్టుగాను, సుస్థిరరాజలక్ష్మీం-సుస్థిర=సుస్థిరులయినబ్రహ్మాదులకు, రాజ=ప్రభువయిన పరమశివునియొక్క, లక్ష్మీం=సారూప్యలక్ష్మిని, ఆవహతి = పొందుచున్నాఁడు.

గీ॥ భావమను వింట నారూఢభక్తిగుణము
మోపి పరశివచింత నామోఘశరము
లేసి, కిల్బిషరిపుల జయించి సుమతి
ప్రమదమునఁగాంచు సుస్థిరరాజలక్ష్మి॥ 7

తా॥ అనగా లోకమందు నొకానొకరాజు బాణముల చేతను, సకలశత్రువులనుజయించి, శత్రురాజలక్ష్మిని యెట్లుపొందుచున్నాఁడో ఆప్రకారము భక్తుఁడయినవాఁడు భక్తిపూర్వకమయిన శివస్మరణములచేతను పాపములకునశింపఁజేసి శివసాయుజ్యమందుచున్నాఁడని ముఖ్యతాత్పర్యము.

శ్లో॥ ధ్యానాంజనేన సమవేక్ష్యతమఃప్రదేశం భిత్వామహా
బలిభి రీశ్వరనామమంత్రైః।దివ్యాశ్రితం భుజగభూషణము
ద్వహంతి యేపాదపద్మమిహా తెశివ తేకృతార్థాః॥

టీ॥ హేశివ = ఓయిసాంబశివుఁడా, ధ్యానాంజనేన, ధ్యాన = ధ్యానమనెడు, అంజనేన = కాటుకచేతను, సమవేక్ష్య = ఈశ్వరపదపద్మరూపవస్తువును లెస్సగాచూచి, ఈశ్వరనామమంత్రైః, ఈశ్వర = సాంబశివునియొక్క, నామ = పేర్లనెడి, మంత్రైః = మంత్రములచేతననెడి, బలిభిః = బలులచేతను, తమఃప్రదేశం = అజ్ఞానమనేప్రదేశమును, భిత్వా = భేదించి,యే = యేభక్తులు, దివ్యాశ్రితం, దివ్యా=దేవతలచే

తను, ఆశ్రితం=పొందబడ్డటువంటి, భుజగభూషణం, భుజగ=సర్పము, భూషణం=భూషణముగాకలిగినటువంటి, తె=నీయొక్క, పాదపద్మం=పాదకమలమును, ఇహ=యీజన్మమందు, ఉద్వహంతి = వహించుచున్నారో, తే = ఆభక్తులు, కృతార్థాః = జన్మసఫలత్వమునుబొందిన వారగుచున్నారు,

మ॥ పనితధ్యానమహాంజనంబునఁ, దమోవాటిం బ్రపాటించి యా
త్మనిరూఢిఁ భవదీయనామజపమంత్ర శ్రీబలింగూర్చి ది
వ్యనిషేవ్యంబు, భుజంగభూషణమునో భావత్కపాదారవిం
ద నిధానంబునుజూఱగొన్న తఁడెకా ధన్యుం డుమానాయకా॥ 72

తా॥ అనగా లోకమందునొక పురుషుఁడు, ధనాంజనమును నేత్రమునకు వేసికొని ధనమునుపాతినప్రదేశమును తెలుసుకొని, బలులు మొదలయినవానిచేతను, ఆనిక్షేపరక్షక దేవతలను స్వాధీనపరుచుకొని, ఆనిక్షేపప్రదేశమును భేదించి నిధినిపొంది సంతోషమును నెట్లనుభవించునో అటువలెనే భక్తులున్ను ధ్యానాద్యుపాయములచేతను ఆపరమ

శివునియొక్క పాదారవిందమును సాక్షాత్కారముచేసుకొని, అన్యులకు సులభముకానట్టి ఆఆనందమును అనుభవించుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ భూదారతాముదవహద్యదపేక్షయా శ్రీభూదార
ఏవకిమతస్సుమతే లభస్వ । కేదారమాకలితముక్తిమహౌష
ధీనాం పాదారవిందభజనం పరమేశ్వరస్య॥

టీ॥ హేసుమతే = ఓయి మంచిబుద్ధిగలిగినవాఁడా, యదపేక్షయా = ఏపాదారవిందదర్శనాపేక్షచేతను, శ్రీభూదారఏవ = లక్ష్మీభూములు భార్యలుగాఁగలిగిన విష్ణుదేవుఁడే, భూదారతాం = వరాహభావమును, ఉదవహత్ = వహించినవాఁడాయెను, కిం = ఏమి, అతః = అందువల్లనుంచి, ఆకలితముక్తిమహౌషధీనాం - ఆకలితః = చెప్పుచునుండెడి, ముక్తి=సాలోక్యాదిచతుర్విధముక్తులనెడి, మహౌషధీనాం = ఓషధులకు, కేదారం = ఉత్పత్తి స్థానమయిన, పరమేశ్వరస్య = సాంబశివుని యొక్క, పాదారవిందభజనం-పాదారవింద = పాదకమలములయొక్క, భజనం = సేవను, లభస్వ = పొందుము.

గీ॥ ముక్తియను మేటి సంజీవి మొలచునట్టి
శ్రీమహేశుపదంబు దర్శింపఁ గోరి
శ్రీహరి వరాహమయ్యె నాయూహఁ గనె
సిరతము భజింపుమా జగద్గురుని సుమతి॥ 73

తా॥ ఏకారణముచేత శ్రీమహావిష్ణువే తన అభిలాషను పూర్తిచేసుకొనుటకై వరాహమై శివపాదారవింద దర్శనమును కోరినవాఁడాయెనో అటువంటి శివభజనమును నీవుసుచేయుము మోయి మంచిబుద్ధిగలవాఁడా యని తాత్పర్యము.

చేతఃపేటి

శ్లో॥ ఆశాపాశక్లేశదుర్వాసనాది భేదోద్యుక్తై ర్దివ్య
గంధై రమందైః। ఆశాశాటీకస్య పాదారవిందం చేతః పేటీం
వాసితాం మే తనోతి॥

టీ॥ ఆశాశాటీకస్య-ఆశా = దిక్కులు, శాటీకస్య = అంబరముగాగలిగిన ఈశ్వరునియొక్క, పాదారవిందం = పాదపద్మము, మే = నాయొక్క, చేతఃపేటీం-చేతః =

చిత్తమనెడు, పేటీం=పెట్టెను, ఆశాపాశక్లేశదుర్వాసనాదిభేదోద్యుక్తాం-ఆశాపాశ= రజ్జువులవంటి ఆశలనెడి, క్లేశ=దుఃఖములను దుర్వాసనాది=దుర్గంధముల మొదలయినవానిని, భేద=భేదించుటయందు, ఉద్యుక్తాం=ప్రవృత్తమైనటువంటిన్ని, దివ్యగంధైరమందైః=దేవయోగ్యపరిమళములచేతను, వాసితాం=వాసనగలిగినదిగా చేయబడ్డదిగాను, తనోతి=విస్తరింపఁజేయుచున్నది.

క॥ ఆశాశాటీరుకాఘ్రిమను
 శేశయము మదాత్మపేటి, జేరిన యాశా
 పాశక్లేశకదుర్గం
 ధాశయముం బాపి దివ్యమౌగంధమిడున్॥ 74

తా॥ దిగంబరుఁడయిన సాంబమూర్తియొక్క పాదారవిందము నామనస్సనియెడి పెట్టెను త్రాళ్ళవంటి ఆశలనెడిదుఃఖదుర్వాసనలను పోగొట్టుచుండునటువంటిన్ని దివ్యములయినటువంటి విస్తారములయిన పరిమళములచేతను పుట్టింపబడిన వాసనకలిగిన

దానిగాను జేయుచున్నది, అనగా మహేశ్వరునియొక్క పాదారవిందములు నామన స్సునందెల్లప్పుడు నుండుగాక యని ముఖ్యతాత్పర్యము.

శ్లో॥ కల్యాణినం సరసచిత్రగతిం సవేగం
సర్వేంగితజ్ఞ మనఘం ధ్రువలక్షణాఢ్యం ।
చేతస్తురంగ మధిరుహ్య చర స్మరారే
నేతస్సమ స్తజగతాం వృషభాధిరూఢ॥

టీ॥ హేవృషభాధిరూఢ = వృషభమెక్కియుండెడువాఁడా, సమస్తజగతాం = సకలలోకములకును, నేతః = ప్రభువైనవాఁడా, స్మరారే = మన్మథునికిశత్రువైనవాఁడా, కల్యాణినం = శుభలక్షణయుక్తమయినదియు, సరసచిత్రగతిం-సరస=అనురాగముతోఁ గూడుకొన్నటువంటి, చిత్ర=నానావిధములైన, గతిం= అస్కందితాది గమనములుగలిగినదియు, సవేగం = వేగముతోఁ గూడుకొన్నదియు సర్వేంగితజ్ఞం=సర్వాంతర్భావములను దెలిసినదియు, అనఘం = నిర్దోషమైనదియు, ధ్రువలక్షణాఢ్యం = రేఖారూపావర్తనాది శుభలక్షణసహితమైనదియునగు,

చేతస్తురంగం-చేతః=మనస్సనియెడు, తురంగం = గుఱ్ఱమును, అధిరుహ్య = యెక్కి-
చర = సంచరించుమా॥

గీ॥ సకలభావజ్ఞ, మనఘము, సజవము, ధ్రువ
లక్షణాఢ్యంబు, కల్యాణి, లలితచిత్ర
యానమును,నైన నా మనోహయముకంటె
నీకు ఁబుదిగొడ్డు ప్రియమయ్యెనే మహేశ ?॥ 75

తా॥ అనగా ఓవృషభతురంగా, సర్వలక్షణయుక్తమైన నామనస్సనియెడు గుఱ్ఱముపైనెక్కి సంచరింపుము అని తాత్పర్యము

శ్లో॥ భక్తిర్మహేశపదపుష్కరమావసంతీ
కాదంబినీవ కురుతే పరితోషవర్షం।
సంపూరితో భవతి యస్యమన స్తటాక
స్తజ్జన్మసస్యమఖిలం సఫలంచ నాన్యత్॥

టీ॥ భక్తిః=సేవ, మహేశపదపుష్కరం-మహేశ= సాంబశివునియొక్క, పదపుష్కరం = చరణాకాశమును, అవసంతీ = అంతటనావరించి, కాదంబినీవ = మేఘమాలికవలెనే, పరితోషవర్షం = ఆనందవృష్టిని, కురుతే = చేయుచున్నది, యస్య= ఏపురుషునియొక్క, మనస్తటాకః-మనః = మనస్సనెడి, తటాకః=మడుగు, సంపూరితః = నిండింపఁబడ్డది, భవతి=అగుచున్నది, తజ్జన్మసస్యం-తత్ = ఆపురుషునియొక్క, జన్మ= ఉత్పత్తియనెడు, సస్యం=పయిరు, అఖిలం=నిశ్శేషముగునట్లుగాను,సఫలంచ = ఫలవంతమైనది, భవతి = అగుచున్నది,అన్యత్ = తదితరజన్మసస్యము, నసఫలంభవతి = సఫలమైనదికాదు.

గీ॥ భవునిపదపుష్కరముఁజెంది భక్తిమేఘ
పంక్తి గురిసెడు పరితోషవర్షమెవని
మానసతటాకమును నింపు వానిజన్మ
సస్యమఖిలంబు సఫలంబు సంస్తుతంబు॥ 76

తా॥ అనగా నెవనియొక్క మనస్సు ఈశ్వరపాదభక్తి పూరితమై యుండునో వానిజన్మము సార్థకము అని తాత్పర్యము

శ్లో॥ బుద్ధి స్థిరాభవితు మీశ్వర పాదపద్మ
సక్తా వధూరి విరహిణీవ సదాస్మరంతీ।
సద్భావనాస్మరణ దర్శనకీర్తనాది
సమ్మోహితేవ శివమంత్రజపేన వింతే॥

టీ॥ హే ఈశ్వర = ఓయియీశ్వరుఁడా, విరహిణీ = భర్తనుండి వియోగమును పొందిన, వధూరివ = భార్యవలెనె, పాదపద్మసక్తా = నీపాదపద్మమందు ఆసక్తమయి యున్నది కావుననే, సదా=ఎల్లప్పుడును, స్మరతీ = ధ్యానము చేయుచు న్నట్టి, బుద్ధిః=శివమంత్రజపేన=శివుఁడనుమంత్రముయొక్క, జపేన = ఆవృత్తిచేతను, సంమోహితేవ = మోహమునె పొందినదానివలెను, స్థిరా = స్థిరమయినది, భవితుం = అగుటకొరకు, సద్భావనాస్మరణదర్శనకీర్తనాది - సత్ = సత్యమయిన పాద పద్మముయొక్క, భావనా = ధ్యానముచేయుటయు, స్మరణ = స్మరించుటయు,

దర్శన = చూచుటయు, కీర్తనాది = కీర్తనముచేయుటయు మొదలయినవానిని గూర్చి, వింతె = విచారపడుచున్నది.

ఉ॥ అమలభవత్పదాంబురుహమందె తగుల్కొని నాదుబుద్ధి ని
న్నె మది స్మరించుచున్ విరహిణీసతి కైవడి నీదునామమం
త్రము జపియించి, మోహపరతన్ స్థిరతన్ గనఁజింతఁ జేయు, ని
త్యము దలపోయఁ, జూడఁగ, సదానినుబాడఁదలంచు నీశ్వరా॥ 77

తా॥ అనగా, ఓమహేశ్వరా భర్తృవియోగమునుబొందిన భార్యవలె నిత్యము నిన్నుగుఱించి నామనంబు స్మరించుచుఁబరవశత్వముఁజెందుచున్నదని తాత్పర్యము.

శ్లో॥ సదుపచార విధిష్వనుబోధితాం
సవినయాం సుహృదం సముపాశ్రితాం।
మమ సముద్ధర బుద్ధిమిమాం ప్రభో
వరగుణేన నవోఢవధూమివ॥ 78

టీ॥ హే ప్రభో-సర్వార్థ=ఘటనసమర్థ-సదుపచారవిధిషు-సత్ = శ్రేష్ఠమైన నీపాదపద్మముమొక్క, ఉపచారవిధిషు=పూజావిధానములయందు, అనుబోధితాం= శిక్షింపబడినదియు, సవినయాం = వినయముతోఁ గూడుకొని యుండునదియు, సుహృదం=మంచిమనస్సును, సముపాశ్రితాం=ఆశ్రయించి యున్న దియునగు,మమ= నాయొక్క, ఇమాం=ఈ, బుద్ధిం = బుద్ధిని, వరగుణేన = శ్రేష్ఠగుణోపదేశముచేతను, నవోఢవధూమివ=నూతనముగా వివాహమైనభార్యనువలె, సముద్ధర=ఉద్ధరించుము.

గీ॥ సముచితోపచారంబుల జాడఁగఱపి
వినయ మెఱిగించి, సన్మనోవృత్తినెఱపి,
మేలిగుణమిచ్చి,క్రొత్తయిల్లాలివలెను
దిద్దికొనుమయ్య,నాదుబుద్ధిం బరేశ!॥ 78

తా॥ అనగా ఓ-ఈశ్వరా నాబుద్ధికిభక్తివినయాది గుణములఁబ్రసాదించి రక్షింపుమని తాత్పర్యము

శ్లో॥ నిత్యం యోగిమనస్సరోజదళసంచారక్షమ స్త్వత్క్రమ
శ్శంభో తేన కథంకఠోరయమరా డ్వక్షఃకవాటక్షతిః
అత్యంతం మృదులం త్వదంఘ్రియుగళం హా మేమనశ్చింతయ
త్యేతల్లోచనగోచరం కురువిభో హస్తేన సంవాహయే॥ 17

టీ॥ హేశంభో = ఓయి సుఖకరుఁడవయిన ఈశ్వరుఁడా, త్వత్క్రమః - త్వత్ = నీయొక్క, క్రమః = పదవిన్యాసము, నిత్యం = ఎల్లప్పుడున్ను, యోగిమనస్సరోజదళ సంచారక్షమః - యోగి = యోగీశ్వరులయొక్క, మనః = మనస్సనెడి, సరోజ = పద్మముయొక్క, దళ = రేకులతోఁడను, సంచార = కూడుటయందు, క్షమః = సమర్థమైనది, తేన = అమృదువైనపాదముచేతను, కఠోరయమరాడ్వక్షఃకవాటక్షతిః - కఠోర = కఠినమైనట్టి, యమరాట్ = యముధర్మరాజుయొక్క, వక్షఃకవాట = తలుపువంటి రొమ్ముయొక్క, క్షతిః - న్నుటను, కథం = ఎట్టుగాను, అత్యంతం = మిక్కిలి, మృదులం = మృదువైన, త్వదంఘ్రియుగళం = నీపాదయుగళమునుగూర్చి, మే = నాయొక్క, మనః = మనస్సు, చింతయతి = చింతిల్లుచున్నది, హా = కష్టము, హేవిభో = ఓయిప్రభువై

నతఈశ్వరుఁడా, ఏతత్ = యీపాదయుగళమును, మె = నాయొక్క, లోచనగోచరం-లోచన = నేత్రములకు, గోచరం = అగుపడినదానినిగా, కురు = చేయుమా, తత్ = ఆ పాదకమలమును, హస్తేన = హస్తముచేతను, సంవాహయె = వహించుచున్నాను.

గీ॥ పరమయోగి మనఃపద్మవాటిఁదిరుగు
మృదులమృదులంబులైన నీ పదములీశ!
కటుకఠోరయమేశ వక్షఃకవాట
పాటనకు నెంతనొచ్చెనో పట్టనిమ్ము॥ 79

తా॥ అనగా, ఓయీశ్వరా పరమయోగీశ్వరుల హృదయకమలములయందే సంచరించు నీమృదుపదములు కఠినమైన యమునివక్షస్థలమునుదన్నుటయందు నొచ్చిన దేమో కొంచెముపట్టెదను అనుగ్రహింపుము అని తాత్పర్యము.

శ్లో॥ఏష్యత్యేషజనిం మనోస్య కఠినం తస్మిన్నటానీతిమ
ద్రక్షాయై గిరిసీమ్ని కోమలపదన్యాసః పురాభ్యాసితః।

నోచే ద్దివ్యగృహాంతరేషు సుమన స్తల్పేషు వేద్యాదిషు
ప్రాయస్సత్సు శిలాతలేషు నటనంశంభో కిమర్థంతవ॥ 80

టీ॥ హేశంభో=ఓయిసుఖకరుఁడవైనయీశ్వరుఁడా, ఏషః=యీజనుఁడు, జనిం=ఉత్పత్తిని, ఏష్యతి=పొందఁబోవుచున్నాఁడు, అస్య=యీజనియొక్క, మనః=మనస్సు, కఠినం=కఠోరమయినది, తస్మిన్=ఆమనస్సునందు, నటానీతి=సంచరింపఁబోవుచున్నానను హేతువుచేతను, మద్రాక్షాయై=నాయొక్కరక్షణముకొరకు, కోమలపదన్యాసః కోమల=మృదులమయినటువంటి, పద=పాదములయొక్క, న్యాసః=ఉంచుటను, గిరిసీమ్ని=పర్వతమధ్యప్రదేశమందు, పురా=నాజననమునకుముందు, అభ్యాసితః=అభ్యసింపఁబడ్డది, నోచేత్=అటుగాకపోయినచో, దివ్యగృహాంతరేషు- దివ్య=రమణీయములయిన, గృహాంతరేషు=గృహమధ్యప్రదేశములయందు, సుమనస్తల్పేషు=పుష్పశయ్యలయందు, వేద్యాదిషు=అరుగులు మొదలైనప్రదేశములయందు, ప్రాయశః=క్రమముగాను, సత్సు=శ్రేష్ఠములైన, శిలాతలేషు=పాషాణప్రదేశములయందు, తవ=నీయొక్క, నటనం=నాట్యము, కిమర్థం=ఎందుకొరకు.

మ॥ జనియించుట ధర నీకు, నీ పదమది పాషాణంబు నేనందునుం
డనగుంగా యని, నీవు కోమలపదన్యాసంబు నాకై శిలా
ద్రిని నభ్యాసము చేసియుందు వటుగాదే సాధకుల్ లేవె మేల్
ననపాన్పుల్ కలవే గిరీశ! మఱియేలా శైలసంచారకుల్॥ 80

తా॥ అనగా, ఓగిరీశ నాయందనుగ్రహముచే నామనంబు కఠినపాషాణప్రాయమై
నను నందే సంచరించుటకు, నాజననమునకు ముందే నీమృదుపదములను కొండరాలపైఁ
దిరుగుట యందలవాటు పఱచినావని తాత్పర్యము.

శ్లో॥ కంచిత్కాల ముమామహేశ భవతః పాదారవిందార్చనైః
కంచిద్ధ్యానసమాధిభిశ్చ నతిభిః కంచిత్కథాకర్ణనైః
కంచిత్కంచిదవేక్షణైశ్చ నుతిభిః కంచిద్దశామీదృశీం
యః ప్రాప్నోతిముదాత్వదర్పితమనా జీవన్ స ముక్తః ఖలు॥

టీ॥ హే ఉమామహేశ = ఓయిపార్వతితోఁ గూడియుండెడు యీశ్వరుఁడా, కంచిత్

కొంచెమయినటువంటి, కాలం = కాలమును, భవతః=నీయొక్క, పాదారవిందార్చనైః- పాదారవింద = కమలములవంటిపాదములయొక్క, అర్చనైః = పూజలచేతను, కంచిత్కాలం=కొంచెముకాలము, ధ్యానసమాధిభిః = ధ్యాన = ఎల్లప్పుడునునిన్ను చింతించుటయొక్క, సమాధిభిః = నియమముచేతను, కంచిత్కాలం = కొంతకాలమును నతిభిః=నమస్కారములచేతనున్ను, కంచిత్కాలం = కొంతకాలమును, కథాకర్ణనైః నీసంబంధమయినకథలువినుటచేతనున్ను, కంచిత్కాలం=కొంతకాలమును, అవేక్షణైః చూచుటచేతనున్ను, కంచిత్కాలం=కొంతకాలమును, నుతిభిః=స్తోత్రములచేతనున్ను సహితః = కూడుకొన్నవాఁడై, ముదా = సంతోషముచేతను, త్వదర్పితమనాః-త్వత్ = నీయందు, అర్పిత = ఉంచబడ్డ, మనాః = చిత్తముఁగలిగినట్టి, యః-ఎవఁడు, ఈదృశీం = ఈపూర్వోక్తమయినటువంటి, దశాం = స్థితిని, ప్రాప్నోతి = పొందుచున్నాఁడో, సః = ఆపురుషుఁడు, జీవన్ సన్ = జీవించియున్నవాఁడైనను, ముక్తః ఖలు = ముక్తుఁడయినవాఁడు గదా.

మ॥ పరమానందముతో భవచ్చరణసేవం గొంతగా, గొంత నీ
స్మరణన్, నీనుతులన్ రవంతయు, నమస్కారంబులన్ గొంత, నీ
చరితంబుల్ వినఁగొంచెమించుక దిగ్పృత్యాదీక్ష, నెవ్వాఁడు త్వ
త్పరుఁడై కాలముఁబుచ్చునో యతఁడు, జీవన్ముక్తుఁ డార్యాపతీ!॥ 81

తా॥ అనగా, ఎవఁడు తనజీవితకాలములోఁగొంతయైన నీశ్వరపాదార్చనాది విషయములయందు నుపయోగపఱచుచు మనస్సు తదధీనము చేయుచున్నాఁడో యతఁడు జీవన్ముక్తుఁడని తాత్పర్యము.

శ్లో॥ బాణత్వంవృషభత్వమర్ధవపుషా భార్యాత్వమార్యాపతే!
ఘోణిత్వం సఖితామృదంగవహతా చేత్యాదిరూపం దధౌ
త్వ త్పాదేనయనార్పణంచ కృతవాన్ త్వద్దేహభాగోహరిః
పూజ్యా త్పూజ్యతర స్సవహీనచే తో ప్యపి వా తదన్యోధికః॥

టీ॥ హే-ఆర్యాపతే=ఓయి పార్వతీపతియైన ఈశ్వరుఁడా, హరిః=విష్ణువు,

యస్మాత్కారణాత్=ఏకారణమువలన బాణత్వం=బాణమవుటయు, వృషభత్వం=వృషభవాహన భావమును, అర్ధనవపుషా=సగము శరీరముచేతను, భార్యాత్వం=కళత్రభావమును, ఘోణిత్వం=వరాహభావమును, సఖితా=స్నేహభావమును, మృదంగవహతా=మృదంగమను వాద్యవిశేషమును వహించుటయు, ఇత్యాది=ఇదిమొదలయిన రూపం=రూపమును, దధౌ=ధరించినవాఁడాయెను, త్వత్పాదే-త్వత్=నీయొక్క, పాదే=పాదమునందు, నయనార్పణంచ=నేత్రముంచుటయు, కృతవాన్=చేసినవాఁడాయెను, కించ=ఇంతేకాదు, త్వద్దేహభాగః-త్వత్=నీయొక్క, దేహ=దేహముయొక్క, భాగః=భాగముకలిగినవాఁడును, అయ్యెను. తస్మాత్=అందువల్ల, సఏవ=ఆవిష్ణువే, పూజ్యాత్=పూజనచేయతగిన బ్రహ్మాదులకంటెను, పూజ్యతరః=మిక్కిలి పూజచేయతగినవాఁడు, అథవత్=అయ్యెను నచేత్=అటుగాకపోయినచో, తదన్యః=ఆవిష్ణువుకంటెఅన్యుఁడు, అధికః=అధికుఁడయినవాఁడు, కోవా=ఎవఁడు?

మ॥ శరమై, సూకరమై, మృదంగధరుఁడై, సామైసతీరత్నమై
తురగంబై, చెలిమై, యనేకములు మూర్తుల్ గాంచి, నేత్రంబు నీ
చరణాబ్జంబున నిల్పి, నీతనువునంశంబంది, తాఁ బూజ్యులం
దురుపూజ్యుండగు శౌరికంటె, నెవఁ డాఢ్యుం డద్రికన్యాపతీ!॥ 82

తా॥ అనగా, ఓపార్వతీశా, మహావిష్ణువు నీతత్త్వమెఱుంగుట కనేకములగు నవతారములనెత్తి నిన్ను సేవించి ధన్యుఁడయ్యెను అని తాత్పర్యము.

శ్లో॥ జననమృతియుతానాం సేవయా దేవతానాం
నభవతి సుఖలేశ స్సంశయో నాస్తి తత్ర।
అజని మమృతరూపం సాంబమీశం భజంతే
యఇహపరమసౌఖ్యం తేహిధన్యాలభంతే॥

టీ॥ జననమృతియుతానాం-జనన =ఉత్పత్తియు, మృతి = మరణమును, యుతానాం = పొందినటువంటి దేవతానాం= దేవతలయొక్క, సేవయా=భజనముచే

తను, సుఖలేశః-సుఖ=సుఖముయొక్క, లేశః = లేశము, నభవతి=పుట్టదు, అత్ర= దీనియందు, సంశయః=సందేహము, నాస్తి = లేదు, యః=యెవఁడు, ఇహ= ఈజన్మమందు, అజనిం=ఉత్పత్తిశూన్యుఁడయినటువంటి, అమృతస్వరూపమయినటువంటి, అనగా మరణరహితమయినటువంటి, రూపము = కలిగినటువంటి, సాంబం= పార్వతీదేవితోఁ గూడుకొన్నటువంటి, యీశం=యీశ్వరునిగూర్చి, భజంతే = సేవ సేయుచున్నారో, తే = వారలు, ధన్యాహి=ధన్యులుగదా.

మ॥ జననంబుల్ మరణంబుగల్గు విబుజ్జాతంబులం గొల్చుచుం
డిన లేశంబుసుఖంబు లేదు, విను లేనే లేద, యీజన్మమం
దు, ననాద్యంతు, నుమామహేశు, నమృతాత్ముంగొల్చిసేవించు ధ
న్యనరశ్రేష్ఠులుచూఱగొంద్రు పరసౌఖ్యప్రాజ్య సామ్రాజ్యముల్॥

తా॥ పుట్టుటయును గిట్టుటయును కలిగిన క్షుద్రదేవతలంగొలిచిన లేశముసుఖము లేదు ఆద్యంతరహితుఁడై మోక్షదాయకుఁడైన పరమేశ్వరుని సేవించినవారే శాశ్వతముగు పరసౌఖ్యమును జెందుచున్నారు.

శ్లో॥ శివతవపరిచర్యా సన్నిధానాయగౌర్యా
భవమమగుణధుర్యాం బుద్ధికన్యాం ప్రదాస్యే।
సకలభువనబంధో సచ్చిదానందసింధో
సదయహృదయగేహే సర్వదా సంవసత్వం॥

బుద్ధికన్య-
మనస్సుగేహం.

టీ॥ హే శివ=ఓయి సాంబశివుఁడా, భవ=భవుఁడను నామధేయముగలవాఁడా, సకలభువనబంధో-సకల=సమస్తమయిన, భువన=లోకములకు, బంధో=బంధువయినవాఁడా, సచ్చిదానందసింధో=సచ్చిదానందములకు సముద్రునివలెనుండెడివాఁడా, సదయ దయఁగూడుకొన్నవాఁడా, గౌర్యాసహ=పార్వతీదేవితోఁగూడను, తవ=నీయొక్క, పరిచర్యాసన్నిధానాయ - పరిచర్యా = సేవకొరకు, సన్నిధానాయ = సమీపమందుండెడుకొరకు, మమ = నాయొక్క, గుణధుర్యాం = సకల సద్గుణభారవాహకమయిన, బుద్ధికన్యాం-బుద్ధి = బుద్ధియనెడు, కన్యాం = కన్యకను, ప్రదాస్యే = దానముచేయుచున్నాను, త్వం=నీవు, హృదయగేహే-హృదయ = మనస్సనెడి, గేహే=గృహమందు, సర్వదా = యెల్లప్పుడును, సంవస = ఉండుము,

శా॥ ఓనిర్వ్యాజకృపానిధీ! భువనబంధూ! సచ్చిదానందసిం
ధూ! నాచిత్తగృహంబునన్ నిలువరాదో, నీవు నీభార్యయున్
గానీ, దాస్యమొనర్పనాదు మతియన్ కన్యామణిన్ సద్గుణ
శ్రీనిన్ నీపదసన్నిధిన్ నిలిపితిన్ జేకొమ్మిదే దాసిగాన్॥ 84

తా॥ వినయాదిగుణములు కలిగిన నాబుద్ధి ఓపరమేశ్వరా! నీకుఁ బరిచర్యఁ జేయుటకు దాసిగానిచ్చుచున్నాను. నాయొక్క మనస్సను గృహంబున నిత్యమువసించి అనుగ్రహింపుము.

శ్లో॥ జలధిమథనదక్షో నైవ పాతాళభేదీ
నచవనమృగయాయాం నైవలుబ్ధః ప్రవీణః
అశనకుసుమభూషా వస్త్రముఖ్యాం సపర్యాం
కథయ కథమహం తే కల్పయానీందుమౌళే॥

టీ॥ ఇందుమౌళే = చంద్రుని శిరస్సునందు ధరించినవాఁడా! తే = నీకు

అశన...ఖ్యాం, అశన=ఆహారము, కుసుమ = పుష్పము, భూషా = భూషణము, వస్త్ర = వస్త్రమును, ముఖ్యాం = ప్రధానములుగాఁగలిగిన, సపర్యాం = పూజోపచారమును, కథం=ఎట్లుగా, కల్పయాని=కలిగించెదను? కథయ = చెప్పుము, అహం = నేను, జలధిమథనదక్షః-జలధి = సముద్రమును, మథన = తరుచుటకు. దక్షః = చాలినవాఁడను, నైవ= కాను. పా...దీ-పాతాళ=పాతాళలోకమును, భేదీ = భేదించువాఁడను, నచ = కాను. వ...యాం-వన = అడవియందు, మృగయాయాం = వేఁటాడుటయందు, ప్రవీణః = నేర్పుగల, లుబ్ధః = బోయవాఁడను, నైవ = కాను.

మ॥ కలశాబ్ధిన్ మథియింపలేను, ఫణిలోకంబేగిరాలేను, కా
నల వేఁటాడెడుపాటివాఁడ మను పుళిందగ్రామణిన్ గానిఁకే
తెలివిన్ నీ కశనప్రసూనకములం దివ్యన్మణీభూరహా
ర లసచ్చేలములంబొనర్చెద సపర్యాచర్య నార్యాపతీ!॥ 85

తా. చంద్రశేఖరా! సముద్రము మథింపఁజాలిన వాఁడనా కాను. నీ కిష్టమైన కాలకూటాహారము గాని పుష్పమువలె శిరోభూషణంబుగ చంద్రుని గాని యెట్లీనేర్తును? పాతాళలోకము భేదించువాఁడనైనఁ గాను. నీకిష్టమైన భుజగభూషణ మెట్లు గల్పించఁగలను? అడవులలో మృగముల వేఁటాడ నేర్చిన బోయవాఁడనైనఁగాను. నీకభిమతంబైన గజచర్మవస్త్రి మెట్లీయఁగలను? దేవా! నిన్ను నే నెట్లు పూజింపఁగలుగుదునో చెప్పుము?

శ్లో॥ పూజాద్రవ్యసమృద్ధయో విరచితాః పూజాంకథం కుర్మహే
పక్షిత్వం నచ వాకిటిత్వమపిన ప్రాప్తంమయాదుర్లభం
జానేమస్తకమంఘ్రి పల్లవముమాజానే న తేహంవిభో
నజ్ఞాతంహి పితామహేన హరిణాతత్వేనతద్రూపిణా॥

టీ. ఉమాజానే=పార్వతీదేవిభార్యగాఁ గలవాఁడా! పూ...యః- పూజాద్రవ్య=పూజించుటకుఁ గావలసిన వస్తువులయొక్క, సమృద్ధయః= అతిశయములు,

విరచితాః = సమకూర్పఁబడినవి. పూజాం=పూజను, కథం = ఎట్లుగా, కుర్మహే = చేయుదుము? దుర్లభం = పొందశక్యముగాని, పక్షిత్వం = హంసపక్షిరూపముగుటయు, న-చ-వా=లేనిచో, కిటిత్వమపి = వరాహరూపముగుటమైనను, మయా = నాచేత, నప్రాప్తం=పొందఁబడలేదు. అహం = నేను, తే = నీయొక్క, మస్తకం = శిరస్సును, అంఘ్రిపల్లవం = చిగురువంటిపాదమును, నజానే=ఎఱుఁగను. విభో = సర్వవ్యాపకుఁడా! తద్రూపిణా = హంసకిటిరూపములు బొందిన, పితామహేన = బ్రహ్మదేవుని చేతను, హరిణా=విష్ణుమూర్తి చేతను, తత్త్వేన=యథార్థముగా, నజ్ఞాతంహి=తెలియఁబడలేదుగదా!

మ॥ సముపార్జించితి దేవ! నీకునయిపూజాద్రవ్యముం గాని పం
తముతో మున్ విధిహంసరూపము, రమాజానుండు భూధారరూ
పమునుందాల్చి, దివిన్ భువిన్ వెదకి, పోల్పన్ లేనినీయుత్తమాం
గము, నీపాదము నేనెఱింగికొని శక్యంబౌనె పూజింపఁగన్॥ 86

తా. పార్వతీ మనోహరా! పూజాద్రవ్యములు విశేషముగా సమకూర్పబడి యుండనిమ్ము. అపుడు మాత్రము నిను పూజించుట యెట్లు? నీ శిరస్సును తెలియదు నీ పాదములును దెలియవు. హంసరూపము, వరాహరూపము, దుర్లభములు. అవి నాకు గలిగినవి కావు. ఆరూపములు దాల్చిన బ్రహ్మదేవుఁడు, విష్ణుమూర్తియు మాత్ర మేపాటి తెలిసికొనగలిగిరి? యథార్థము తెలియనేలేదు గదా!

శ్లో॥ అశనం గరళం ఫణీకలాపో వసనం చర్మచ వాహనం మహోక్షః॥ మమదాస్యసికిం కిమస్తిశంభో తవపాదాంబుజభక్తిమేవ దేహి॥

టీ. శంభో = ఓ శంకరుఁడా! తవ = నీకు, అశనం = భోజనము, గరళం = విషము కలాపః = భూషణము, ఫణీ = పాము. వసనం = వస్త్రము, చర్మ = ఏనుగుతోలు, వాహనంచ = వాహనమును, మహోక్షః = ముసలియెద్దు, కిం = ఏమి, దాస్యసి = ఇచ్చెదవు? మమ = నాకుఁగావలసినది, కిం = ఏమి, అస్తి = ఉన్నది? తవ = నీయొక్క, పాందాంబుజభక్తిమేవ- పాదాంబుజ = పాదపద్మములయందు, భక్తిమేవ = భక్తిమాత్రమే, దేహి = ఇమ్ము.

గీ॥ అన్నము విసంబు, నగ లెన్నఁ బన్నగములు
వసన మొకతోలు వాహనంబు ముసలియెద్దు
ఇంక నేమీయఁగలవు నాకేమి వలదు
పార్వతీశ; భవత్పాదభక్తి నిమ్ము॥ 87

తా. సౌఖ్యనిధీ ! నీవు భుజించునది విషము, అలంకరించుకొనునది పాము, కట్టుకొనునది యేనుఁగుతోలు, ఎక్కి తిరుగు వాహనము ముసలియెద్దు, ఇంక నాకిష్టమయినది నీయొద్ద నేమియున్నది? నీ వేమి యిచ్చెదవు? నీపాదభక్తి యొక్కటే చాలు నదియిమ్ము!

శ్లో॥ యదాకృతాంభోనిధి సేతుబంధనః కరస్థలాధఃకృతపర్వతాధిపః।భవాని తేలంఘిత పద్మసంభవ స్తదాశివార్చా స్తవభావనక్షమః॥

టీ. శివ = ఓసాంబమూర్తీ! యదా = ఎప్పుడు, కృ...నః-కృత = చేయఁబడిన, అంభోనిధి = సముద్రమందు, సేతుబంధనః = వారధినిర్మాణముగలవాఁడను,

కర...పః-కరస్థల=అఱచేతితో, అధఃకృత = దిగువకణఁచఁబడిన, పర్వతాధిపః=విం ధ్యపర్వతముగలవాఁడను, లంఘి...వః-లంఘిత= అతిశయింపఁబడిన, పద్మసంభవః = బ్రహ్మదేవుఁడు గలవాఁడను, (అగుదునో) తదా = అప్పుడు, తే = నీయొక్క,-అర్చా స్తవ-అర్చా = పూజయందును, స్తవ = స్తోత్రమందును, భావన=ధ్యానమందును, క్షమః = సమర్థుఁడను, భవాని = అగుదును.

శా॥ నేనే వారిధిఁగట్టు రాఘవుఁడ నేనిన్, వింధ్యభూమీధ్రముఁ
జేనొక్కంగల కుంభసంభవుఁడ నేనిన్, బద్మజుఁ మించు వి
జ్ఞాన శ్రీనిధి నేని, తావకపదార్చాకీర్తనధ్యాన ని
ష్ఠానిష్ణాతుఁడనై గణింతుఁగద యీశా! నీదుసాన్నిధ్యముఁ॥ ౮౭

తా. సాంబశివా! సముద్రమునకు వారధి గట్టిన శ్రీరాములును అఱచేతితో వింధ్యపర్వతము నేలకణఁచిన యగస్త్యులును, బ్రహ్మదేవునికన్న నెక్కువవాఁడును నేనగుదునేని క్రమముగా నీపూజాస్తోత్ర ధ్యానములు చేయుటకు సమర్థుఁడనుగా నుందును.

శ్లో॥ నతిభి ర్నుతిభి స్త్వమీశ పూజా
విధిభి ర్ధ్యానసమాధిభి ర్నతుష్టః
ధనుషా ముసలేనచా శ్మభిర్వా
వద తే ప్రీతికరం తథాకరోమి॥

టీ. ఈశ = ఓ ఈశ్వరుఁడా! త్వం=నీవు, నతిభిః = నమస్కారముల చేతను, నుతిభిః = స్తోత్రములచేతను, పూజావిధిభిః = పూజావిధానములచేతను, ధ్యానసమాధిభిః = ధ్యానసమాధులచేతను, ధనుషా = వింటి దెబ్బలచేతను, ముసలేనచ = రోకలిపోట్లచేతను, అశ్మభిర్వా = రాళ్లు రువ్వుటచేతనుంబలె, తుష్టః=సంతోషించినవాఁడవు, న=కావు. తే=నీకు, ప్రీతికరం=(పైరెంటిలో) ప్రియమైనది, వద = చెప్పుము,తథా= అటు, కరోమి = చేయుదును.

చ॥ నతులును, సన్నుతులును, సమర్చలును ధ్యానప్రక్రియల్ నీకు స
మ్మతిగావేని వచింపు మేకతన యుష్మత్ప్రీతియానో జగ

త్పతి ! కోదండముఁ దాల్తునో, ముసలముఁ బాటింతునో సాహసో
ద్ధతి నీతోఁ డఁ బెనంగి రువ్వుదునో మీఁదన్ గండశైలంబులన్॥ 89

తా. పరమేశ్వరా! నమస్కారములు, స్తోత్రములు, పూజలు, ధ్యానములు సమాధులు మున్నగువానితోఁ దృప్తినొందక వింటిదెబ్బలు, రోకలిపోట్లు, రాళ్లు రువ్వుట మొదలగువానితోఁ బరమప్రీతి నొందితివని పురాణగాథలువింటిని. ఇందు నీకేది ప్రియమో చెప్పుమటు చేయుదును.

శ్లో॥ వచసా చరితం వదామి శంభో
రహముద్యోగ విధాసు తే ప్రసక్తః
మనసాకృతి మీశ్వరస్య సేవే
శిరసాచైవ సదాశివం నమామి॥

టీ. అహం = నేను, తే = నీయొక్క, ఉద్యోగ = ఉన్నతయోగముల యొక్క, విధాసు = విధానములయందు, అప్రసక్తః = పరిచయములేని వాఁడను, వచ

సా = వాక్కుచేత, శంభోః=సుఖస్వరూపుఁడవగు, తే = నీయొక్క, చరితం = చరితమును, వదామి = చెప్పుచున్నాను. మనసా = మనస్సుచేత, ఈశ్వరస్య=ఈశ్వరుఁడవైన, తవ = నీయొక్క, ఆకృతిం=ఆకారమును, సేవే = సేవించుచున్నాను. శిరసా = శిరస్సుచేత, సదాశివం = నిత్యసుఖస్వరూపుఁడవైన, త్వామేవ = నిన్నే,నమామి=నమస్కరించుచున్నాను.

క॥ తలపుఁననిను గొలుచుటయుఁ
దలచే మ్రొక్కుటయు, వాక్కుననునీచరితం
బులు గీర్తించుటగాకే
కలుములువలదయ్య నాకుగౌరీరమణా! ౧౦

తా. దేవా! ఉత్తమంబులైన శివయోగంబులయందు పరిచయము లేదు. చిత్తమంత స్థిరముగా నిలువదు కావున వాక్కుతో మీచరిత్రంబులు పలుకుచు మనస్సున మీయాకృతిధ్యానించుచు శిరస్సుతో మీపాదపద్మములకు నమస్కరించుచు శక్తివంచన లేక సేవించెదను.

శ్లో॥ ఆద్యావిద్యా హృద్గతానిర్గతాసీ
ద్విద్యా హృద్యాహృద్గతా త్వత్ప్రసాదాత్
సేవేనిత్యం శ్రీకరం త్వత్పదాబ్జం
భావేముక్తేర్భాజనం రాజమౌళే॥

టీ. రాజమౌళే = ఓచంద్రశేఖరా! త్వత్ప్రసాదాత్ = నీయనుగ్రహమువలన, హృద్గతా = హృదయము నంటియున్న, ఆద్యా= మొట్టమొదటిదియగు, అవిద్యా = యజ్ఞానము, నిర్గతా = తొలగిపోయినది. అసీత్ = అయ్యెను యా = ఏజ్ఞానము. హృత్ = హృదయగ్రంధిని హరించునదియో, (సా = ఆ), విద్యా = జ్ఞానము,హృద్గతా=హృదయమునఁ బ్రవేశించిన (దయ్యెను). శ్రీకరం=సంపత్కరమును, ముక్తేః = మోక్షమునకు, భాజనం=ఆధారమైనదియునగు, త్వత్పదాబ్జం = నీపాదపద్మమును, భావే=మనస్సునందు, నిత్యం=ఎప్పుడును, సేవే=ధ్యానించుచున్నాను.

గీ॥ నాదుమదిఁదొల్తనున్న యజ్ఞానమణఁగి
హృద్యమగువిద్య నీకృపనెసఁగెఁగాన

రాజమౌళి! నిశ్శ్రేయసభాజనంబు
శ్రీకరము నీపదాబ్జము మాసింతు నెపుడు॥ 91

తా. సాంబశివా! నీ యనుగ్రహమువలన నాయజ్ఞానము తొలంగిపోయి హృదయ గ్రంధిభేదకం బగుసుజ్ఞానంబు గలిగినది. లక్ష్మీకరంబును మోక్షప్రదంబును నగు నీపాద యుగ్మము సేవించెదను.

శ్లో॥ దూరీకృతాని దురితాని దురక్షరాణి
దౌర్భాగ్యదుఃఖదురహంకృతి దుర్వచాంసి
సారం త్వదీయ చరితం నితరాం పిబంతం
గౌరీశ మామిహ సముద్ధర సత్కటాక్షైః॥

టీ. గౌరీశ=ఓపార్వతీరమణా ! దురక్షరాణి= బ్రహ్మలలాటమందువ్రాసినదు ష్టలిపిసూచకములును, దురితాని=పాపకర్మముచేతఁ గలిగినవియు,దౌ...సి-దౌర్భాగ్య= దురదృష్టమును, దుఃఖ=దుఃఖము, దురహంకృతి=దుష్టములగు దేహాదులయందు'అహం'

అనుభావమును, దుర్వచాంసి=పరుషభాషణమును, సత్కటాక్షైః=నీకడకంటి చూపులచేత, దూరీకృతాని=దూరముగాఁబోఁగొట్టఁబడినవి. సారం=సారమైన, త్వదీయచరితం=నీచరిత్రను, నితరాం=మిక్కిలి, పిబంతం=వినుచున్న, మాం=నన్ను, ఇహ=ఈజన్మమందు, సముద్ధర=ఉద్ధరింపుము.

మ॥ దురితంబుల్ సమసెన్, శుభాక్షరపుఁబంక్తుల్ మాసె, దౌర్భాగ్యదుః
ఖ రిరంసల్ నశియించెఁ, బోయె దురహంకారంబు, దుర్వాక్యముల్
దొలఁగెన్ నీకృపచేత నో భువనబాంధవా! కావుమా సారవ
చ్చరితోదారకథామృతాసుధల నీజన్మంబు వేగించెదన్ ॥ 92

తా. సాంబశివా! ఉత్పత్తికాలమున బ్రహ్మ నుదుట వ్రాసిన వ్రాతలను సూచకంబులై పాపకర్మమువలన గలిగిన దురదృష్టము, దుఃఖము, దురహంకారమును నీకటాక్షవీక్షణముచేఁ బాసినవి. ఇంక సారభూతమైన నీచరిత్రంబులు వినుచుందును. నన్నీ జన్మమునుండి తరింపఁజేయుము.

శ్లో॥ సోమకళాధరమౌళౌ కోమల
ఘనకంధరే మహామహాసి
స్వామిని గిరిజానాథే మామక
హృదయం నిరంతరం రమతామ్॥

టీ. మామకహృదయం = నామనస్సు, సోమకళాధరమౌళౌ = శిరస్సున చంద్రకళ ధరించినట్టియు, కో...రే-కోమల = కోమలమైన, ఘన = మేఘమువంటి, కంధరే = మెడగలిగినట్టియు, స్వామిని = సర్వనియామకమైనట్టియు, గిరిజానాథే = పార్వతీరూపమైన; మహామహాసి = మహాజ్యోతియందు, నిరంతరం = ఎల్లప్పుడును, రమతాం = క్రీడించుగాక.

క॥ సోమకళాధరమౌళిన్
హైమవతీనాథుఁ గోమలాంభోదగళున్

స్వామిని, మహానుభావుని
మూమక హృదయాంబు వలచి మతిరమియింపుమ ॥ 93

తా. శిరస్సున చంద్రరేఖ, కోమలమైన మేఘమువంటి కంఠమునుగలిగి సర్వాని యంతరయై పార్వతీపరమేశ్వర రూపముతో వెలయుచున్న పరజ్యోతిస్స్వరూపమైన పరబ్రహ్మమునందు నాచిత్తమెప్పుడును విహరించుచుండుఁగాక.

శ్లో॥ సా రసనా తేనయనె తావేవ
కరౌ సఏవ కృతకృత్యః
యాయేయాయో భర్గంవద
తీక్షాతే సదార్చతస్స్మరతి॥

టీ. యా = ఏనాలిక, భర్గం=పరమశివునిబోధించు 'భర్గ' శబ్దమును, వదతి= పలుకుచుండునో, యే = ఏకన్నులు, భర్గ=శివుని, ఈక్షాతే = చూచుచుండునో, యౌ = ఏచేతులు,భ ర్గం = శివుని, సదా = ఎల్లప్పుడును, అర్చతః=పూజించుచుండు

నో, యః = ఏభక్తుఁడు, భర్గం=శివుని, స్మరతి = తలంచుచుండునో, సా = అదియే, రసనా = నాలుక, తే = అవియే, నయనే = కనులు, తావేవ = అవియే, కరౌ = చేతులు, సఏవ = వాఁడే, కృతకృత్యః = కృతార్థుఁడు.

క॥ అదెనాలుక, యదెకన్గవ
యదె కరయుగమతఁడెధన్యులందుఁ ధన్యుం
డెదిశివుఁబలుకునో, కనునో
యెదిపూజించెడినో యెవ్వఁడెంచునుభక్తిన్॥

94

ఎల్లప్పుడీశ్వరనామముచ్చరించుచుండు నాలుకయేనాలుక. ఎల్లవేళలనీశ్వరుని చూచుచుండు కన్నులేకనులు. ప్రతిదినమీశ్వరుని పూజించుచుండు చేతులేచేతులు. నిరంతరము పరమేశ్వరుని ధ్యానించుచుండు భక్తుఁడే కృతకృత్యుండునగును. తక్కినవి నిరర్థకంబులని తాత్పర్యము.

శ్లో॥ అతిమృదులతామమచరణా
పతికఠినం మేమనోభవానీశే

ఇతివిచికిత్సాం సంత్యజ
శివకథ మాసీద్గిరౌతథా ప్రవేశః॥

టీ. శివ = ఓమంగళ స్వరూపుఁడా! భవానీపతే = ఓపార్వతీపతీ!, మమ = నాయొక్క, చరణౌ = పాదములు, అతిమృదుళౌ = మిగులకోమలమైనవి, తే = నీయొక్క, మనః = మనస్సు, అతికఠినం = మిక్కిలికఠినమైనది, ఇతి = అని, విచికిత్సాం = సంశయమును, సంత్యజ = విడువుము. తథా = అట్టి, గిరౌ = పర్వతముమీఁద, ప్రవేశః = సంచారము, కథం = ఎట్లు, ఆసీత్ = అయ్యెను?

గీ॥ మృదులమృదులంబు లగునాదుపదము లేడ
పరుషపరుషంబయిన నీదుభావమేడ
యనిననదిచెల్లునయ్యా యట్లైన
కొండయందెట్లుతిరిగెదు కొండతేఁడ॥ 95

తా. దేవా! భవానీసనాథా! ఈభక్తునిచిత్తము మిక్కిలి కఠోరముగా నుండు

ను. కోమలమైన నాపాదములతో దానియందు సంచరించుటయెట్లని మీరు సంశయింపఁ బనిలేదు. అంతకఠోరముగా నుండు పర్వతముమీదఁ గౌరీసమేతులై మీరుసంచరించుటలేదా?

శ్లో॥ ధైర్యాంకుశేన నిభృతం రభసా
దాకృష్య భక్తిశృంఖలయా
పురహార చరణాలానే హృదయ
మదేభం బధాన చిద్యంత్రైః॥

టీ. పురహార=త్రిపురములు జయించినవాఁడా, హృదయమదేభం= (నా) మనస్సను మదపుటేనుఁగును, ధైర్యాంకుశేన=ధైర్యంబనెడి యంకుశముతో, రభసాత్= వేగమువలన, ఆకృష్య= వశపరచుకొని, భక్తిశృంఖలయా= భక్తియనుగొలుసుతో, చరణాలానే= మీపాదంబను యేనికకట్టూడునందు, చిద్యంత్రైః= ఈశ్వరమహిమజ్ఞానంబు లనెడి యంత్రములతో, నిభృతం =కదలకుండ, బధాన = బంధింపుము.

మ॥ మదవన్మాత్మక చిత్తవారణము నంబానాథ! ధైర్యాంకుశ
ప్రదరంబూని మదోద్ధతింగెడపి దివ్యజ్ఞానయంత్రస్థలిఀ
గదియంజేరిచి భక్తినామనిగళోద్ఘాతంబుతోడఀ భవ
త్పదంబను కట్టుకంబమునకుఀ బంధించి సాధింపుమా॥ 96

తా. పురహరుండవైన ఓమహాదేవా! శత్రుపురంబులు జయించినరాజు మత్తగజంబుల నంకుశంబుతో వశపఱచుకొని గొలుసులతో బిగించి యుపాయమున కట్టుఁగంబంబులం గట్టియుంచునట్లు నామనోగజంబును స్థైర్యమంకుశముగా నీవశము చేసికొని భక్తియను సంకెలతో నీమహత్త్వజ్ఞానము ముడివెట్టి నీపాదంబున బంధింపుము.

శ్లో॥ ప్రచరత్యభితః ప్రగల్భవృత్త్యా
మదవా నేష మనః కరీగరీయాన్
పరిగృహ్యనయేన భక్తిరజ్వా
పరమస్థాణుపదం దృఢం నయాముమ్॥

టీ. పరమ = ఓఅపరిచ్ఛిన్న స్వరూపుఁడా!, మదవాక్ = మదముగలిగిన, గరీయాక్ = గొప్పదియగు, ఏషః = ఈ, మనఃకరీ = చిత్తగజము, ప్రగల్భవృత్త్యా = అప రానిగమనముతో, అభితః = అంతటను, పరిచరతి = సంచరించుచున్నది, అముం = దీనిని, భక్తిరజ్వా = భక్తియను త్రాడుతో, నయేన = అనునయముతో, పరిగృహ్య = పట్టుకొని, స్థాణు = స్థిరమయిన, పదం = స్థానమును, దృఢం = మరలతిరిగిరాకుండ, నయ = పొందింపుము.

క॥ మత్తిల్లి యిచ్చవచ్చిన
యెత్తున నెల్లెడఁ జరించుసీ నాచిత్తో
న్మత్తగజంబుం జేర్పుము
దాత్తప్రభక్తి యనుమేటిస్థాణు పదంబుక్॥ 97

తా. ఓఅపరిచ్ఛిన్నానందమూర్తీ! ఈనామానసమత్తగజము నిలుపుటకు వీలుపడని గమనముతో నలువంకలఁ బరువు లిడుచున్నది. దీని నీభక్తియను త్రాడుతో గట్టి కొల్లగాఁబట్టుకొని పునరావృత్తి రహితముగా స్థిరమైన బ్రహ్మపదము జేర్పుము.

His ideal of poetry compared with a girl.



శ్లో॥ సర్వాలంకారయుక్తాం సరళపదయుతాం సాధువృత్తాం సువర్ణాం
సద్భిస్సంస్తూయమానాం సరసగుణయుతాం లక్షితాంలక్షణాఢ్యామ్
ఉద్యద్భూషావిశేషా ముపగతవినయాం ద్యోతమానార్థరేఖాం
కళ్యాణీందేవగౌరీప్రియ మమ కవితా కన్యకాం త్వం గృహాణ॥

టీ. గౌరీప్రియ = గౌరీదేవి ప్రియురాలుగాఁగల, దేవా = మహాదేవా!, స...క్తాం-సర్వ = సమస్తమైన, అలంకార = ఉపమ, ఉత్ప్రేక్ష మొదలగు అలంకారముల తోడను (భూషణములతోడను), యుక్తాం = కూడినదియు, స...తాం-సరళ = మృదువైన, లేక సుబోధమైన (మందమగు)పద= శబ్దములతో (నడకలతో), యుతాం= కూడినదియు, సాధువృత్తాం = సలక్షణమైన ఆర్యావృత్తము మొదలగువృత్తములు గల దియు (మంచినడతగలదియు), సువర్ణాం=పరుషములుగాని అక్షరములుగలదియు (చక్క నిరూపముగలదియు), సద్భిః = కావ్యలక్షణము (శరీరలక్షణము) దెలిసిన పెద్దలచేత సంస్తూయమానాం = కొనియాడఁబడుచున్న దియు, సరసగుణయుతాం=శృంగారాది

రసములు మాధుర్యాదిగుణములు వీనితోఁగూడినదియు (భర్తకిష్టంబగు గుణములతోఁగూడినదియు), లక్షితాం = ప్రతిపాద్యవస్తువుగలదియు (వరింపఁదగినదిగా నెన్నఁబడినదియు), లక్షణాఢ్యాం = సర్వలక్షణముల నొప్పునదియు, ఉ...షాం-ఉద్యత్ = ఎక్కువగా బ్రకాశించుచున్న, భూషావిశేషాం= అలంకారవిశేషముగలదియు (సుశీలత్వముగలదియు), ఉపగతవినయాం-ఉపగత= తెలియఁబడిన, వినయాం=(కవియొక్క)వినయముగలదియు (పొందఁబడినసమ్రతగలదియు), ద్యో...ఖాం-ద్యోతమాన=స్పష్టముగా స్ఫురించుచున్న, అర్థరేఖాం = అర్థములపరంపరగలదియు (భాగ్యరేఖగలదియు), కల్యాణీం=అర్థపుష్టిగా భాషించునదియైనదగు, మమ = నాయొక్క, కవితాకన్యకాం = కవితయనుకన్యకను, త్వం = నీవు, గృహాణ = స్వీకరింపుము.

మ॥ సకలాలంకృతసంస్కృతంబు, సుమనస్సంస్తూయమానంబు స
ర్వకలాలక్షణలక్షితాఢ్యము, సువర్ణద్యోతమానార్థముం,
బ్రకటశ్రీగుణముం, సువృత్తమును శుంభద్భూషణంబైనమా
మక కావ్యంబను కన్యకామణిని, బ్రేమం గొమ్ము గౌరీప్రియా॥

తా. గౌరియందు ప్రేమగలవాఁడవైన ఓమహాదేవా ! ఈనాకవితాకన్య కన్య కాలక్షణంబులు గలిగి కల్యాణమునకుఁ దగియున్నది. లోకమందుకన్య సర్వాభరణంబులు కలిగియుండును. ఇయ్యదియు సర్వాలంకారములుఁ గలిగియున్నది. కన్యక సరళపపదంబు (మందగమనంబు)లనొప్పారు. ఇయ్యదియు మృదువై సుబోధంబులగు పదంబులతో సొంపు నింపుచున్నది. కన్యక సాధువృత్త (సత్కర్మములయందు ప్రవర్తించునది) యగును. ఇయ్యదియు లక్షణ విరుద్ధముగాని వృత్తములు కలిగియున్నది. 'సువర్ణ' మనఁగా కన్యకు సురూపంబును గవితకుఁ బరుషంబులుగాని యక్షరములుం గలవు. శరీరలక్షణమెఱిఁగిన వారాకన్యను మెచ్చుకొందురు. కావ్యలక్షణవేత్త లీకవితనుఁ గొనియాడుచున్నారు. కన్యకు సరసమైన గుణములుండును. దీనికి శృంగారాదిరసంబులును మాధుర్యాది గుణంబులుంగలవు. కన్యవరుల యెన్నికవడిసినట్టు లియ్యదియు నొక్కయంశమును గూర్చిన యెన్నికగలదియై యున్నది. సర్వలక్షణసంపత్తి యిరువురకుం గలదు. కన్య వినయము గలదియగును. కవితయుఁ గవివినయముఁ దెలుపఁగలిగి యున్నది. కన్యకు సుశీలత్వము ఆభరణ విశేషముగాఁ బ్రకాశించును. కవితయందును విశేషాలంకా

రములు ప్రకాశించుచున్నవి. కన్యయం దర్ధరేఖలనఁగా భాగ్యరేఖలు స్ఫురించుచుం డును. కవితయందును పదార్థపరంపర స్ఫురించుచున్నది. అర్థపుష్టి గలిగిన భాషణము సాధారణముగాఁగలదు. ఇట్టి నాకవితాకన్యను నీకిచ్చెదను ప్రతిగ్రహింపుము.

శ్లో॥ ఇదం తే యుక్తం వా పరమశివ కారుణ్యజలధే
గతౌ తిర్యగ్రూపం తవపదశిరోదర్శనధియా
హరిబ్రహ్మాణౌ తౌ దివిభువి చరంతౌ శ్రమయుతౌ
కథం శంభోస్స్వామిన్కథయ మమ వేద్యోసిపురతః॥

టీ. పరమశివ=సకలదేవతా సార్వభౌముఁడవైన శివుఁడా!, కారుణ్యజలధే=కరుణాసముద్రుఁడా! తవ=నీయొక్క, పదశిరోదర్శనధియా=పాదములను, శిరస్సునుఁ గనుఁగొనవలయునను బుద్ధితో, తిర్యగ్రూపం=తిర్యగ్జంతువు (పంది, హంస)ల రూపమును, గతౌ=పొందిన, తౌ=ఆ, హరిబ్రహ్మాణౌ= విష్ణుమూర్తియు, బ్రహ్మదేవుఁడును, దివి= ఆకాశమందును, భువి=భూమియందును, చరంతౌ=సంచరించుచున్నవారలై,

శ్రమయుతౌ=ఆయాసముతోఁ గూడినవారలు, (స్యాతాం=అయిరి.) శంభో=సుఖప్రదుఁడా!, స్వామిన్=సర్వలోకాధినాథా!, మమ = నాయొక్క, పురతః = ముందరను, వేద్యః=కనుఁగొనఁదగినవాఁడవు, కథం=ఎట్లుగా, అసి = అగుదువు?, కథయ= చెప్పుము, ఇదం = ఇది, తే = నీకు, యుక్తంవా=తగునా?

మ॥ సరవిన్ దావకపాదశీర్షక దిదృక్షాదీక్షమైమున్నుశ్రీ
హరియున్ దామరసప్రసూతియును, దిర్యగ్రూపులై భూనభోం
తరమాద్యంతముపంతముంగొని శ్రమన్గాలించిగాలించితా
వరయంజాలనినీపదంబిఁక ననంతా! కాంతునే నేక్రియన్॥ 99

తా. పరమశివా ! మీపాదదర్శనమునకై పందిరూపముందాల్చి శ్రీహరియు శిరోదర్శనమునకై హంసరూపముదాల్చి బ్రహ్మయుఁ బాపమిట్లు తిర్యగ్జంతువు లగుటయేగాక భూమ్యంతరిక్షము లందంతటదిరిగి పలువిధములఁ బాటుపడికాని ఫలముగాంచకుండిరి. ఓశంకరా!స్వామి!సరియే? ఇప్పుడు మీరు నాయెదుట ప్రసన్నులై నాకెట్టు

తెలియనగుదురో తెలవిందు. శివుఁడు భక్తపరాధీనుఁడు గాన హరిబ్రహ్మలకలవి గాని తన దర్శనమును భక్తులకొసంగునని ముఖ్యాభిప్రాయము.

శ్లో॥ స్తోత్రేణాలమహం ప్రవచ్మి న మృషా దేవావిరించాదయ
స్స్తుత్యానాంగణనా ప్రసంగసమయే త్వామగ్రగణ్యంవిదుః
మాహాత్మ్యాగ్ర విచారణ ప్రకరణే ధానాతుషస్తోమవ
ద్ధూతాస్త్వాం విదురుత్తమోత్తమఫలంశంభో భవత్సేవకాః॥

టీ. శంభో = సుఖకారణమైనవాఁడా!, భవత్సేవకాః= నీభక్తులయిన, విరించాదయః = బ్రహ్మాదులగు, దేవాః = దేవతలు, స్తుత్యానాం= స్తుతింపఁదగిన వారల యొక్క, గణనాప్రసంగసమయే= లెక్కనుగుఱించి చర్చించునప్పుడు, త్వాం=నిన్ను, అగ్రగణ్యం= మొదటగణింపఁ దగినవానిఁగా, విదుః= తెలిసికొనుచున్నారు,మా...ణే- మాహాత్మ్య = సృష్టిస్థితిలయ సామర్థ్యమునుగూర్చిన, అగ్రవిచారణ= మొదటిచర్చను, ప్రకరణే= చేయునప్పుడును, ధానాతుష స్తోమవత్ = సారములేని ధాన్యమునందలి పొట్టంతయుంబోలె, ధూతాః = కదలి పోయినవారలై, త్వాం = నిన్ను, ఉత్తమో త్తమఫలం = మిగుల సారమైన ధాన్యముగా, విదుః= తెలిసికొనుచున్నారు. స్తోత్రేణ

స్తుతిచేత, అలం=చాలును, అహం=నేను, మృషా = అసత్యము, నప్రవచ్మి=చెప్పను.

మ॥ నినుస్తోత్రవ్యులలో గణింత్రు మొనగానింగా విధాత్రాదుల
ల్ల నజాండాదికసృష్టిలోనయిన లీలల్ వారునీముందు నెం
దునరుల్ గారిఁక, నుత్తమోత్తమఫలస్తోమంబునీకంటె లే
దని నీభక్తజనంబెఱుంగు, నిజమీశా! యింకఁజాలుల్ నుతుల్ ॥ 97

తా. శంభో! మహాదేవ! బ్రహ్మాదులగు ముప్పదిమూడుకోట్లదేవతలను స్తోత్రార్హులను లెక్కించునప్పుడు నిన్ను మొట్టమొదటవానిగా లెక్కపెట్టుచున్నారు. సృష్టిస్థితిలయసామర్థ్యరూపమైనమాహాత్మ్యమును గుఱించి చర్చించునప్పుడు, ధాన్యపురాశి యెగురఁబట్టునప్పుడు పొట్టంతయు దూరముగాఁ బోయినట్లు తామందఱు దూరమైపోయి సారమై ధాన్యమునట్లు నిన్నుత్తమోత్తమునిగాఁగనుచున్నారు. దేవా! ఇవి వట్టిస్తుతిపాఠములుగావు. నేను చెప్పినదంతయు నిజముగాని యిసుమంతయు నసత్యము గాదు. సకల శ్రుతిస్మృతి ప్రసిద్ధము. స్వామీ! బ్రహ్మాదులందఱు మీసేవకులే గదా!



# శుద్ధపత్రిక.

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 20 | 6 | దొరకినవాడా | దొరకానివాడా। |
| 28 | 1 | నీవిచార | నవిచార |
| 51 | 4 | తరూల్లసత్ప్ర | తరూల్లసత్ప్ర |
| 59 | 4 | చూడిచి | చూడిసి |
| 72 | 1 | లక్షి్త్రతో | లక్షితో |
| 77 | 4 | ఉత్పాదంబు | ఉత్పాతంబు |
| 98 | 10 | స్వత్వత్వ | స్వాత్వత్వ |
| 123 | 11 | దివ్యాభిషేకా | దివ్యాభిషేకచ్ఛాయానే |
| 127 | 9 | వేఁదలిరు | లేఁదలిరు |
|  | ,, | నొన్చు | నొచ్చు |
| 138 | 8 | సాంద్ర్యప్రియగా | దభ్రప్రక్రియగా |
| 159 | 7 | గంభిరిక | గంభీరిక |
| 174 | 4 | త్ప్రదం | త్ప్రదపద్యం |